నొకరితరువాత నొకరునిలిచి పంక్తికై యెదురుచూచుచుండిరి. రాణాసమీపమున వాని దాదికుమారుఁడు, సురాజమల్లుచేఁ జంపఁబడిన రాజపుత్రునికుమారుఁడు, చెరియొక ప్రక్కనుండిరి. సురాజమల్లు మిక్కిలిజాగరూకుఁడై యేనిమిషమున నడవిపంది కత్తుల వంటి కోరలతో వెడలివచ్చి యెవనిమీఁద బడి చంపునోయని రెప్పవాల్పక వదలక చూచుచుండెను. అంతలో రివ్వుమని ధ్వనితో నొకబాణము సురాజమల్లువైపునకు వచ్చెను. ఆధ్వని విని యతఁడు మెడత్రిప్పి వెనుకకుచూచి యాబాణము రాణావద్ద నుండి వచ్చుటఁ జూచి యేదోమృగముమీఁద వేయుగా నది గురితప్పి తనవంకవచ్చెనే కాని యుద్దేశించి వేయలేదనుకొని యాబాణమును తనకత్తితో రెండుముక్కలుచేసి యపాయమును దప్పించుకొని యట్టి పొరబాటు రాకుండ జాగ్రత్తగానుండుమని రాణాతోఁ జెప్పుటకు రెండడుగులు పెట్టెను. అంతలో రాణాయొక్క దాదికొడుకు మరియొకయమ్ము వింటఁదొడిగి సురాజమల్లుపై విడిచెను. బూందీప్రభువు అదియుం దప్పించుకొని విస్మితుఁడై చూచుచుండ నంతలో రాణా యేమరిపాటున గుభాలున వచ్చి వానిపయింబడి కత్తితో నొక్కపోటు పొడిచెను. సురాజమల్లుని పరిచారకులు దూరముననుండుటచేతను దగ్గఱనున్నను స్త్రీవలె రక్షణకై సహాయమడుగుట వానికిష్టములేకుండుటచేతను నతఁడు క్రిందపడియుఁ గేకలు వేయక గాయమునకు దన శాలువును గట్టిగఁజుట్టి రక్తము రాకుండ యాపెను. పోటుపొడిచిన తోడనే పిఱికిబంటగు రాణా తనమరఁది చచ్చిపోయెననుకొని తిరిగిచూడక యచ్చోటువిడిచి పారిపోయెను. “నీవెంతవేగముగ బరుగెత్తినను నీప్రాణము దక్కదు. నీకును మావారునకును ఋణము దీరినది” యని గాయముచేత బాధపడుచు నేలబడియున్న సురాజమల్లు కంఠమెత్తి కేకవేసెను. సురాజమల్లుచే జంపఁబడిన రాజపుత్రునికొడుకు రాణానుజూచి “సగము సగముగా జేసిన పనివలన లాభముండదు. చేసినపని పూర్తిగాజేయుము” మని యుపదేశముచేసెను. ఈయుభయుల పలుకులచే రాణా రోసము దెచ్చుకొని శత్రువుం గడతేర్చుటకు మరలబోయెను. సురాజమల్లుఁ డాజానుబాహువగుటచే వాని చేతులు తక్కినరాజపుత్రుల హస్తములకన్న పొడవుగనుండెను. ఆమాట మఱచి రాణా వానిం జంపుటకు సమీపమునకుఁ బోగా నేలఁబడియున్న బూందీరాజు మెల్లమెల్లగ నోపిక దెచ్చుకొని చేతులుసాచి గుఱ్ఱముమీదనున్న రాణాకాళ్లు పట్టుకొని క్రిందికి బడలాగెను. అంతట నేలఁబడిన యాయిరువురుశూరులు నొకరికొకరు దొరకకుండఁ గ్రిందఁ మీఁదఁబడి కొంతసేపు పవస్థపడ నెట్టకేలకు దృఢబలశాలుఁడగు సురాజమల్లుఁడు పగతు

నడుమునఁ బడవైచి మోకాలు వానిపైఁబెట్టి తన కైజారుతీసి వాని కుచ్ఛిత హృక్రియము పైకి వెడలివచ్చునట్లు పొడిచి లాగెను. రాణా కిక్కురుమనకుండ ప్రాణమువదలెను. సురాజమల్లుఁడును వెనుకటిగాయముచే నీరసపడి మృతినొందెను. వారి బంట్లు వారివారి దేశములకుఁబోయి యజమానుల దుర్మరణముల నంతఃపుర స్త్రీలకుం దెలిపిరి. ఆవార్త సురాజమల్లుని తల్లివిని యించుకయైన వగవక కంటతడిపెట్టక వార్త తెచ్చిన వానితో నిట్లనియె. "నాపుత్త్రుఁడు చనిపోయినాఁడు సరే పగవానిం జంపకుండఁ దానొక్కఁడె చచ్చినాఁడా? నిశ్చయముగ నాచనుబాలు ద్రావిన వాఁడొంటిగఁ బరలోకమున కెన్నఁడుఁబోఁడుగదా!" ఆసమయమున నామెమనస్సున గర్వముదుఃఖము నొకదానినొకటి మించి పైకి వెడలవలయునని యత్నింప నెట్టకేలకు గర్వమే వెడలెను ఆముసలియవ్వ గర్వముతో విజృంభించియున్న యాసమయమునఁ జిరకాలముక్రిందట శుష్కించిన యామెపయోధరములు సంతోషమున మరల నుబ్బెననియు నుబ్బినతోడనే రెండు పాలచుక్కలు నేలఁబడెననియు బడినతోడనే నేల తాపటముచేసిన రాతిపలకలు వానితాకునఁ బగిలెననియుఁ బెద్ద లిప్పటికిం జెప్పుకొందురు. సుజాభాయి భర్తృమరణమువిని యదియంతయు మున్నుతాను జేసిన పరిహాస ఫలమేయని తెలిసి మగనితో సహగమనము చేసెను. ఆవిధముగానె రాణావెల్లెఁలు భర్తయగు సురాజమల్లుతో గలసిచితిపైఁ బవ్వళించి మేనుఁదొరంగెను. ఈవిధముగ మరియొకసారి వసంతకాలపువేట పతివ్రతా శాపప్రకారము ముగిసెను.

అనంతరము గొంతకాలము రెండుదేశములు నెమ్మదిగనుండెను. పదునెనిమిదవ శతాబ్దముయొక్క యంతమందు మీవారు సింహాసనముమీఁద గర్వి పొగరుఁబోతు నైన యరసీ యనునతఁడు గూర్చుండెను. బూందీరాజ్యమున కజితుఁడను నతఁడు ప్రభువుగ నుండెను. అరసీ రాజ్యమునకు వారసుఁడగు సోదరపుత్రునిఁ జంపి సింహాసనమెక్కినందునఁ బ్రజలు వానిపై నిష్టములేనివారై యుండిరి. బూందీ ప్రభువగు నజితుఁడు జిన్నతనమందె తండ్రియగు నోమీడాప్రభువు రాజ్యమునేగి చితానెక్కఁడికో... ను మీవారు ప్రభువులకు బూందీప్రభువులకు బూర్వమునుండియు సరిహద్దుల కలహములుండెను. ఆప్రదేశములో బికేటా యను నొకచిన్న గ్రామము కలదు. యాయూరు కడు చిన్నదైన పారము లేనిపుల్ల మామిడి కాయలు దప్ప నక్కడ మఱియే యాదాబడమి యాయూ రెవ్వరికి లాభకారి కాదు. ఆయూరిలో గొందఱు బందిపోటు వాండ్రు గలరు. ఆదొంగలు బూందీ సంస్థానముపైఁబడి యూళ్లుదోఁచి ప్రజలను బాధిం

చుట్టు బూందీరాజు తానా గ్రామమునకు హక్కు వదలుకొని యాద్రోహుఁడు కాంక్ష యాగడములు నివారించుటకై యాగ్రామ సమీపమున నొక సేన నిలిపెను. కొండెములు చెప్పి జీవించు మహానుభావులు కొందఱు రాణాకడకుఁబోయి బూందీప్రభువు తమ రాజ్యము నాక్రమించుకొను చున్నాఁడని నేరములు చెప్పిరి. రాణా యదివిని నిజమరయక బికేటా గ్రామమువద్దనుండి సేనలఁ దీసికొనిపొమ్మని బూందీప్రభువున కాజ్ఞాపించెను. అంతట నిరుదెగల పెద్దలు కలహములు ముదిరిపోవునని భయపడి రాణాకు బూందీరాజునకు సమావేశము చేసిరి. ఆకలహములో బూందీరాజు రాణాయొక్క శీవిని గౌరవమునుజూచి సంతసించెను. అజితుని ప్రతాపము ధైర్యముఁజూచి రాణా మెచ్చెను. ఈమెప్పులవలన గలిగిన లాభమేమన బికేటా గ్రామమునుగూర్చి వివాద పడగూడదని వారు కృతనిశ్చయులై మైత్రిమెఱయ బూందీయడవులలో వసంతకాలపు వేట కలిసి సలుపు నట్లొడంబడి తమపట్టణములకుఁ బోయిరి. బూందీసంస్థానమున నున్న యడవులలో నందతగుట్టలని కొన్ని చిన్నకొండలుగలవు. అక్కడ వేటాడుటకుఁ గావలసిన జంతువులన్నియు అనఁగా బెబ్బులి మొదలగు క్రూరజంతువులు జింక మొదలగు సాధుజంతువులు లభించును. అందుచేత రాణా యాశపడి నందతగుట్టలలో వెనుక రెండుమూఁడుసారులు తమకులమువారికిఁ బ్రాణహానికలిగిన దన్నమాట మఱచి తిరిగి యా యడవులలోనే యాగుట్టలలోనే వేటాడుటకునొప్పుకొనెను. వసంతకాలము రాఁగానే వారిరువురు వేటకు సన్నాహము సేయునప్పుడు పెద్దలు వారిని రావించిరి. వెనుకటి బూందీప్రభువగు నొకఁడా రాజ్యము విడిచి విరాగియై తీర్థయాత్రలు చేయుచు తన కుమారుని వసంత మృగయా క్రీడమాటవిని పతివ్రతాశాపము వానికి జ్ఞప్తికిఁ దెచ్చి వేటవద్దని వర్తమానమంపెను. కాని యజితుఁడు నవ్వి యంతమాత్రమునకు భయపడి వేటమాననని చెప్పెను. అక్కడ రాణాభార్య యజితునిభార్య సోదరి యగుటచే వేటతోడి యల్లురకిద్దఱకు నపాయము దెచ్చునని చెప్పి మానుమని బ్రతిమాలెను. కాని రాణా యామాట సరకుచేయఁడయ్యె.

రాణాతో మీవారులోనున్న మంత్రి సామంతులందఱు వేటఁజూడవచ్చిరి. అప్పుడు ప్రధానమంత్రి రాణాకు రావుకు నొకచోట విందుచేసెను. ప్రభువులిద్దఱు తమతమ పరివారములతోవచ్చి విందులారగించిరి. అంతవఱ కంతయు నెమ్మదిగనే జరిగెను. భోజనానంతరమున బూందీరాజు మరునాడు వేటలో గురి సరిగనుండుటకుఁ

బెందలకడ నిద్రింపఁ దనగుడారమునకుఁ బోయెను పోయి నిద్రించుచుండ నర్ధరాత్రి మున నతని గుడారమునకు నొక క్రొత్త పురుషుఁడు పోయి వానిని మేలుకొలిపెను. అతఁడు మీవారు రాణాగారి ప్రధానమంత్రియే. అర్ధరాత్రమున వచ్చి యేల నిద్ర మేలుకొలుప వలసెనని బూందీప్రభువడుగ వాఁడిట్లనియె "స్వామీ! యిది నాతప్పు గాదు. మా రాణాగారు వెనుకటి సంధిమాటలు మఱచి చికేటా గ్రామమువద్దనుండి తక్షణమే మీసేనలఁ దీసికొని యీవలకుఁ బోవలసినదని మీతో చెప్పుమనినారు. మిమ్ము నోట నుచ్చరింపరాని బండబూతులు తిట్టినారు" ఆపలుకులువిని యజితుఁడు మిక్కిలి యక్కజపడి చూడసాగెను. అందలి యథార్థమేమన రాణా నిజముగా యజితునివద్ద కట్టి రాయబారఁ బంపలేదు. రాణాయొక్క పరిపాలనము క్రూరముగ నుండుటచే నది భరింపలేక యేదో కలహము పెట్టి యుద్ధములోఁ గడతేర్చిన పక్షమునఁ దాముసుఖింపవచ్చునని మంత్రి సామంతులు యోచించి యీబూటకములు పలుకుమని ప్రధానమంత్రిని బూందీప్రభువు కడకంపిరి. ఆ మాయవాక్యములు పలికి మంత్రి తనసంకల్పము కొనసాగునని సంతసించి తననిలయమునకుఁ బోయెను. మఱునాటి యుదయమున నిద్దఱు ప్రభువులు వేటలో గలిసికొనిరి. బూందీరాజు తనయెడ రాణా కావించిన వెనుకటి ద్రోహముల నప్పటి ద్రోహములఁ దలఁచి చంబల్ నదీయొడ్డున వానిం బలిపెట్టవలయునని నిశ్చయించుకొని సమయము దొరకక నో మనోధైర్యములేక నో వేటలో నేఁజంపక యూరకుండెను. దినాంతమందు వేటముగిసినపిదప రాణా యజితునిఁ బిలిచి మందహాసముతో మాటలాడి మరునాటి యుదయమున మరల కలిసికొన వలయునని చెప్పిపంపెను. అజితుఁడు సరే యని కొన్నియడుగులు నడచి మరల వెనుకకుఁ బోయి మరల సందేహించి నడయాడఁ జొచ్చెను. అజితునకుఁ దనమాటలయర్థము తెలియలేదేమోయని రాణా విస్పష్టముగాఁ జెప్పఁదలచి "మీరింక వెళ్లవచ్చును రేపుదయము గలిసికొంద" మని పలికెను. మంచిదని యజితుఁడు మరలిపోయెను. పోయినట్లే పోయి యజితుఁడు చివాలున వెనుకకుఁ దిరిగి యరిసీమీఁదఁబడి యీటెతో వానిని వానియెక్కినగుఱ్ఱమును దూసివెళ్లునట్లుఁ బొడిచెను. క్రూరుఁడగు నజితుఁడు రాణాను దుదముట్టింపఁదలఁచి మరల ఖడ్గము నెత్త మరణము నొందుచున్న రాణా "ఛీ! యేమిపనిజేసితివయ్యా" యని పలికెను. రాణాయొక్క మంత్రి సామంతులు సేనాపతులు మహాభయావిష్టులై సూర్యబింబ ధ్వజమును బట్టుకొని బూందీ ప్రభువు జోలికిఁబోక తిరిగిజూడక చెల్లాచెదరై పరుగెత్తిరి. శిబి

రము నిర్జనమయ్యెను. రాణా మృతినొందెను. వానికళేబరముఁ గాఁచు వారుగాని జూచువారుగాని లేరైరి. ఆతఁడుదయమున వేటాడి తెరిమిన క్రూర సత్త్వములే వానిశరీరము భక్షింప వచ్చెను. రాణా తనవెంటఁ దెచ్చిన పరివార మంతలో విశ్వాసము గల దొక్క యాఁడుది యుండెను. ఆమెవాని భార్యకాదు. అది యొకయుంపుడు కత్తె ఉంపుడు కత్తె యయినను బతివ్రత ఆమెపారిపోవక రాణా యున్నకడకుఁ బోయి కొందఱిసేవకులంబిలిచి మహారాజునకు దహనము చేయుటకొకచితియైనఁ బేర్పుఁడని ప్రార్థింప వారియ్యకొని యొకచెట్టుక్రింద చితిపేర్చి శవమును దానిపైఁ బెట్టిరి. ఆకాంతయంతట నాచితిపైనెక్కి శవము నొడిలోఁ బెట్టుకొని నలుదెసల నగ్నిదరికొల్పుమని సేవకుల కాజ్ఞాపించి నిప్పంటుకొన్న తోడనే యిట్లని పలికెను. "ఓ విశాలవృక్షమా ! నే పలికెడు పలుకులువిని విన్నట్లు సంజ్ఞనైనఁ జేయుము. యీదినమున శత్రువుఁడు పూర్వవిరోధ కారణమునఁ జంపెనేని వాఁడు నిర్దోషియై సుఖించుగాక! అట్లుగాక ద్రోహబుద్ధితో నిష్కారణముగఁ జంపెనేని యాహంతకుఁడు రెండునెలలు దిరుగకుండ లోకమద్భుతమొందునట్లు దారుణమరణము నొందుగాక !" ఆవచనములు ఆమెనోట నుండి వెడలినతోడనే చెట్టునుండి యొకపెద్దకొమ్మ విఱిగిపడెను. ఆయింతి తనమాటలకు వృక్షము ప్రత్యుత్తర మిచ్చెనని సంతసించి రాణా ప్రక్కను బండుకొని యగ్నిలో మ్రగ్గెను. ఇదిజరిగిన రెండునెలలకే యజితునకు దారుణమగు కుష్ఠవ్యాధి ప్రవేశించెను. ప్రతిదినము వానియెముకలనుండి కుళ్లుమాంసము ముక్కలుముక్కలుగ దిగిపడుచువచ్చెనఁట. అదిప్రవేశించిన యల్పకాలములోనే యతఁడు మృతినొందెను. అయిన ప్రభువులిద్దఱు నడవి కలిసిపోవ మీవారుగద్దెమీఁదను బూందీగద్దెమీఁదను బాలకులిరువు రెక్కిరి. ఎక్కినదిమొదలు రెండుసంస్థానములకు నాపదలు పరంపరలుగ వచ్చెనఁట. ఈవిధముగ మాడవమారు పతివ్రతాశాపము ఫలించెనని పెద్దలుచెప్పుదురు.

కలియుగములో నీవిధముగ స్త్రీలుశాపము లిచ్చుటయు నిచ్చినట్లు సరిగా జరుగుటయు నుండునా యని కొందఱకు సందియము తోఁచవచ్చును. ఆసందియము మేమీ క్రిందివిధముగ నివారింపగలము శాపమిచ్చినంతమాత్రమున నట్టి శాపముతగిలి యెవ్వరుఁ జావరు. శపించినమాట మాత్రము నిజమైయుండవచ్చును ఏలయన దుఃఖపరవశత్వము చేత మనఃక్షోభమునొందినవారు సాధారణముగ "మాయుసురు వారికిఁ దగులకపోదు సుమీ ? వారి వంశనాశనము కాఁగలదుసుమీ" యని తరుచుగ దిట్టుచుందురు. దైవవశ

మానఁ బెట్టిన కొన్నినాళ్లకే యపకారముచేసిన మనుష్యుఁడు మృతినొందుట సంభవించెనా శాపముతగిలియే యతఁడు మృతినొందినాఁడని లోకు లనకమానరు. ఈ పతివ్రతా శాపమునట్టిది. పాణిగ్రహణ మహోత్సవమైనను ముగియకమునుపే తననిమిత్త మేర్పడిన వరుఁడు మృతినొందినకారణమున మహాదుఃఖవిహ్వలయై యారాజపుత్రిక విసుగుక నట్లు దిట్టియుండవచ్చును. అనంతరము రెండు తెగలవారికిఁగల మనస్పర్థలచేత నిరుపత్తుములన్న వీరు లాండోరుల జంపుకొనిరి చుట్టము లామెమాటయందు నమ్మికగలిగి యామెశాపముచేతనే యాచావులు సంభవించెనని తలంచిరి. అంతియేగాని వేడినీళ్లచేత నిల్లుకాలుటయు మాటలవలన మరణములు సంభవించుటయు లోకవిరుద్ధము. ఆశీర్వచనముల కాయువు వృద్ధియై శాపమువలనఁ జావులు సంభవించినయెడల లోక మిావిధముగానుండదు.

## జసల్మీరు రాజుల కథలు.

జసల్మీరు సంస్థానము మారువారున కుత్తరమున నున్నది. ఇదియును చిన్న సంస్థానము. రాజస్థానపు టెడారిలోని చిన్నదేశము మిక్కిలి సారవంతమైనది. రాజస్థానమందలి తక్కిన రాజకుటుంబములన్నియు సూర్యవంశములని ప్రఖ్యాతి గాంచుచుండ జసల్మీరు రాజకుటుంబమువారు తాము చంద్రవంశస్థులమని చెప్పుదురు. చంద్రవంశములో వీరు భట్టికులములోఁ జేరినవారు. వారిరాజునకు రావను బిరుదు కలదు. ఈభట్టి వంశస్థులు చుట్టుప్రక్క దేశములలోఁ గాపురముండిన తక్షకవంశస్థులతోను వరాహావంశస్థులతోను యుద్ధములు చేయుచువచ్చిరి. తక్షకులు తక్షకుఁడను సర్పరాజు వంశస్థులఁట. వరాహులు వరాహదేవునివంశస్థులఁట. ఈతక్షకులు మొట్టమొదట మీవారులోఁ గాపురముండిరనియు వారే చిత్తూరుపట్టణము నిర్మించిరనియుఁ జెప్పుదురు.

ఎనిమిదవ శతాబ్దమందు జసల్మీరులో గొప్పయుద్ధములు జరిగెను. ఆకాలమున రావు టన్నోయను నతఁడా దేశ మేలుచుండెను. వానిశత్రువులగు వరాహులు మొగలాయిలు పటానులు మొదలగు తురకలతోఁ గలిసి వానిమీఁదికివచ్చి వానికోటను నాలుగుదినములు ముట్టడించిరి. అయిదవనాడు టన్నో కోటతలుపులు తెరిపించి భట్టివంశభూషణుఁడు శూరశిఖామణియగు తనకుమారుఁడు బీజీరావును వెంటబెట్టుకొని సేనాసమేతుఁడై శత్రువులమీఁదికి దుమికెను. పటానులు మొగలాయిలు వరాహులు రాజపుత్రుల దాడికి నిలువలేక పక్షులవలె నానాదిక్కులకుఁ బలాయితులయిరి. రాజపుత్రులు గెలుపును గైకొనుటయేగాక శత్రువుల శిబిరమంతయుఁ గొల్లగొనిరి. అది మొదలు శత్రువు లెవ్వరు టన్నోజోలికిఁ బోవవెరచిరి. అతని కోటలో విజయసేన యను దేవతయుండెను. ఆకులదేవతయే వారినిరక్షించుచు వచ్చెనని చెప్పుదురు. ఆదేవత రావు టన్నో భక్తికిమెచ్చి భూమిలోనుండిన సొమ్ముపాతును వానికిఁ జూపెనఁట. అతఁడా నిక్షేపమును ద్రవ్వి తీసుకొని సంపన్నుఁడై యొకకోటఁ గట్టించి దానికి విజయనాథమని పేరుపెట్టెను.

రావు టన్నొ యెనుబదిసంవత్సరములు పరిపాలించి మృతినొంద వానికొడుకు బిజీరావు పితురనంతరము గద్దెనెక్కెను. అతఁడు భూశవంశస్థురాలగు నొకరాజకన్యను బెండ్లియాడెను. అతని యేలుబడి చక్కగా నేయుండెను. గద్దె యెక్కిన తోడనే యతఁడు ప్రాఁతపగతురగు వరాహులను బలుకయ్యములలోఁ దరిమితరిమి కొట్టి యోడించెను. అతని ధాటికోపలేక యెట్టకేలకు వానిసంధికై ప్రార్థించిరి. బీజీరావు కుమారుఁడగు దేవరాజు వరాహరాజు కుమార్తెను బెండ్లియాడినపక్షమున నుభయవంశములు చిరక్రోధానలములను జల్లార్చుకొని శాశ్వతమైత్రి నుండవచ్చునని వరాహులభిలషించిరి. బీజీరావు వారిప్రార్థనము నంగీకరించి నిష్కళంకమైన మనస్సుతోఁ గుమారునిఁ బరివారమును దోడ్కొని వివాహమునకై వరాహుల సదనమునకుఁ బోయెను. కాని యావివాహము నెయ్యమగుటకుమారు కయ్యమయ్యెను. బీజీరావు దేవరాజు మొదలగు భట్టీవంశస్థులందఱుఁ దమ యాయుధములఁదాఁచి విందులారగించు సమయమున దురాత్ములగు వరాహు లడవి పందులవలె వియ్యాలవారిపైఁ బడి మారి మసలినట్లు సంహరించిరి. బిజీరావు నాఁడెనిమిది వందలమంది బంధువులతోఁ గలిసి దారుణ మరణము నొందెను. అంతతోఁబోక వరాహువులు ముస్తలఁ బెల్లగించినట్లుఁ బగతురఁ బెల్లగింపఁదలఁచి విజయనాటపు కోటకుంబోయి యాఁడుది మగవాఁడను భేదములేక ప్రాణముతో నున్న జంతువులనెల్ల ఖడ్గమున కెరజేసి భట్టివంశము నిర్మూల మైనదని సంతసించి స్వదేశమునకుఁ బోయిరి. కాని బీజరాజు కుమారుఁడగు దేవరాజు ప్రాణములతో నున్నాఁడని వారెఱుఁగరైరి. అతనిపెండ్లినిమిత్తము భట్టీలందఱు వరాహుల యూరికిం బోయినపుడు పుట్టినసంక్షోభములోఁ బెండ్లికుమారుఁడగు దేవరాజు మరణముఁ దప్పించుకొని యొక యోగియింట దాఁగియుండెను. ఆబాలుఁడు యోగిగృహముఁ బ్రవేశించి తనపేరు తనయూరిపేరు తిన్నఁగా జెప్పకమునుపే వీధితలుపు పగులగొట్టినట్లు చప్పుడు వినఁబడెను. భట్టి వంశస్థులలో నొకబాలుఁడు తప్పించుకొని పోయినాఁడని తెలిసి వరాహులు జాడలుతీసి వాఁడు జోగియిల్లు చేరెనని గ్రహించి వెంటఁబడిమి వాకిలుఁ దట్టిరి. జోగి వరాహ ప్రభువునకు గురువుఁబరమ పుఁడే కాని యెంతగుణుఁడైనను శరణుఁజొచ్చిన వానిని బట్టి యప్పగించుట కిష్టపడఁడయ్యె ఆలోచనము చేసినఁ గార్యము మించునని యాజోగి చప్పుచప్పున రాచబిడ్డ మెడలో

నొక జందెమువేసి తనపంక్తిని విస్తరివేసి యన్నముపెట్టి కలిసి భుజించుచుండెను. అంతలో వరాహులు తలుపు తీయించుకొని లోనికిఁబోయి గురువును వారిప్రక్క నున్న బాలునింజూచి వాఁడెవఁడో బ్రాహ్మణ శిష్యుఁడని భావించి వానినివిడిచి రాచబిడ్డను వెదకుటకు వేరొక చోటికిఁ బోయెను.

దేవరాజు కొంతకాలము యోగిమఠమునఁ బ్రచ్ఛన్నుఁడై బ్రాహ్మణవేషమునఁ నుండి పౌరుషహీనమైన యావృత్తిలో నుండుట కిష్టపడక శత్రువులు తన తండ్రికోట నిశ్శేషముగ నాశనముచేసిరో లేక తల్లిగాని తక్కిన చుట్టము లెవ్వరైనఁగాని జీవించియుండిరో లేదో తెలిసికొనఁగోరి పరితపించుచుండెను. యోగి యెక్కడికైనఁ బోవలసి వచ్చినపుడు దేవరాజునొక్కని మఠములో నుంచి పోవుచుండును. అట్లొకనాఁడు యోగి వానినేకతమ విడిచి యెక్కడికో జన దేవరా జేమియుండునో యని మఠములో నిట్టటు తిరుగుచుండ నొక ప్రాఁత యంగరక వానికగపడెను. అది పైకి దీయుటయు నందుండి చిత్రమైన యొక రసముతో నిండియుండిన యొకపాత్ర క్రిందఁబడెను. దేవరాజు రసములో నొకబొట్టు తనఖడ్గముచివర వేసెను వేసినతోడనే వాడిగల యా కత్తియొక్క మొత్తనై పదునుతప్పెను. కాని యాభాగమంతయు సువర్ణమయమయ్యెను. అదిచూచి దేవరాజు మిక్కిలి యద్భుతపడి యాయోగి దివిజుల యనుగ్రహముచేత ప్రతి వస్తువును బంగారముచేయఁగల దివ్యౌషధము సంపాదించి సిద్ధుఁడైన మహాత్ముఁడని తెలిసికొనెను. తనప్రాణములు రక్షించిన మహా యోగిసొమ్మపహరింపఁ దగునాయని గొంకుజంకులేక యారాచపట్టి ఖడ్గమును, రసపాత్రను తన బట్టచాటున నిరికించి యచ్చోటు వాసి తన యమ్మవంక చుట్టములున్న భూతాపట్టణమునకుఁ బోయెను. అక్కడకుఁ బోవునప్పటికి నదృష్టవశమున 'తనోన్నమి' గ్రామమున శత్రువుల బారిఁబడక బ్రతికివచ్చిన తల్లియే వానికన్నుల కగపడెను. ఆమె కొడుకు నానవాలుపట్టి కౌఁగిలించుకొని దీవించి కొంచెము ముప్పు దిగదుడిచి 'నాయనా! నీశత్రువులిట్లే కరిగి పోవుదురుగాక' యని పలికి యాయుప్పు నీటిలో వేసెను. ఆమె సోదరుఁడగు భూతమహారాజు సహజముగ భీరువగుటచే మేనయల్లునిరక్షింపక, వానిరాకచే ననేక కష్టములు సంభవించునని భయపడెను. దేవరాజు తన వివాహమునకు నొక

గ్రామమిమ్మని మేనమామ నడిగెను. మేనమామ యెంతో కష్టముమీఁద నొకగ్రామము వానికిచ్చెను. ఆరాజు చుట్టము లదివిని కనిం జూచి యిట్లనిరి. "ఏమి ! మేనల్లునకు గ్రామమిచ్చితివా? అతఁడు పదిబల్లెములు పోగుచేసి మొనగాఁడై చుట్టుప్రక్కలనున్న జనులం దోఁచుకొనును. వారందఱు మన ప్రాణముల కుసురుమని మనపై తిరుగఁబడుదురు" మేనమామ దేవరాజు వద్దనుండి యిచ్చిన గ్రామము మరలఁ బుచ్చుకొనెను. తోడనే దేవరాజు తలదాఁచుకొనుటకై యిల్లు కట్టుకొనుటకు కొంచెము చోటిమ్మని మేనమామను మిక్కిలి వినయమున ప్రార్థించెను. ఆప్రార్థనలచేత బ్రాణము విసుగ దేవరాజునకు మేనమామ యొక యెద్దుచర్మము పట్టినంతమేర స్థలమిచ్చెను. అంత స్వల్ప స్థలమందు గృహము కట్టుకొనుట యసాధ్యమగుటచే దేవరాజు కర్తవ్యమును గూర్చి విచారింపఁగ నతఁ డుపాయశాలియైనందున నెద్దుచర్మము సన్న పేలికలుగఁగోసి యొకదానికొకటి ముడిపెట్టి చాలభూమి నాక్రమించి యదియే యెద్దుచర్మము పట్టినంత మేర స్థలమని చెప్పెను. మేనమామ దానికి విచారపడక సమ్మతించెను. ఏలయన మేనల్లుఁడు కొలిచి పుచ్చుకొన్న స్థల మిసుక యెడారిలో నుండెను. మఱియు దేవరాజు కోటనుగాని గృహమునుగాని కట్టుకొనుటకు ధనహీనుఁడై యుండెను. అట్లుండి దేవరాజు కొంతతడ వాలోచించి వెనుక జోగివద్దనుండి దొంగిలించిన సువర్ణరసము మాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని యారసము కొన్నిఁ వస్తువులపై వేయ నవి బంగారు వస్తువులయ్యెను. అవి యమ్మి యతఁడొక గొప్ప కోటఁ గట్టించెను.

అది విని మేనమామ యీర్ష్యఁజెంది యాకోట నేలతో సమముగ మట్టము చేయుమని తనభటుల కానతిచ్చి స్వయముగ దండు తీసుకొని కోటకుఁబోయెను. ఆకోటగుమ్మముకడ కతఁడు పోవునప్పటికి వానిమీఁద బాణవర్షము గురియుటకుమూరు కడుసన్మానముఁ జరిగెను. భూతరాజు తోఁబుట్టువనగా దేవరాజుతల్లి తాళము చేయి బట్టుకొని కుమారుని క్షమియింపుమని వర్తమానములంపుచు గుమ్మముకడ నిలిచెను. ఆ సమయమున నామె పలికిన పలుకు లివి. "నిలువనీడయైనను లేనపుడు నాకొడుకునకుఁ దలదాఁచుకొనుటకు స్థలమిచ్చిన మహోపకారిమీఁదికి నాబిడ్డ కయ్యమునకుఁ గాలు దువ్వఁడు. ఈకోటయు నాకుమారుని తలయుఁగూడ భూతరాజువే. [illegible]న. లోనికిఁ

బోయి నాకొడుకిచ్చు కానుక లందుకొనుఁడు" అని పలికి కొన్ని కారణములమీఁద నొక్కసారి పదిమందికంటె నెక్కువ జనమును గోటలోనికి రానియ్యకపోయెను. శత్రువులు దానికి సమ్మతించి పదుగురు చొప్పున గోటలోఁ బ్రవేశింపఁగానే దేవరాజు వారిని దుత్తునియలుగ నరికి యావల బారవేయుచు వచ్చెను అట్లు నూటయిరువది మంది మహావీరులు మృతినొందినపిదప వారు మోసము తెలిసుకొని పలాయితులైరి.

అది జరిగిన కొన్నాళ్లకు దేవరాజుకడ కొక యోగివచ్చెను ఎవని మతమునఁడే దేవరాజు మున్ను బంగారముచేయు రసము దొంగిలించెనో యా యోగియే యతఁడు. దేవరాజు వాని జూచి భయపడెను గాని యా యోగిమాత్రము వానిని దండించుటకు రాలేదు. జసల్మీరు కోట బట్టుకొనుట దేవరాజుయొక్క సంకల్పమని యెఱిఁగిన వాఁడగుటచే దానికి దోడ్పడుటకే యా యోగివచ్చెను. దేవరాజు తనసువర్ణ కరణి యపహరించిన దొంగయని యా జోగి యెఱిఁగియు వానిఁ దిట్టక నీవు నాశిష్యుఁడ వగుదువేని నీచేసిన నేరము క్షమియింతునని పలికెను ఆమాట యన్నదే చాలనని దేవరాజందు కొడంబడిరి: తోడనే జోగి యా రాజకుమారుని జరీబట్టలు విప్పించి కాషాయవస్త్రములు గట్టించి నిరాయుధునిచేసి యోగులు జాల్చు కమండలు విచ్చి బిచ్చమెత్తుమనిరి. దేవరాజు ప్రతిగృహమున కరిగి కొంతసేపు బిచ్చమెత్తిన పిదప యోగి వాని ననుగ్రహించి తనకడకు రావించి వానికి రావు బిరుదముతీసి రావుల్ బిరుదమిచ్చి భిక్షాపాత్రమునిండ వెండి బంగారము పోసి మొగమున రాజచిహ్నముగు టీకావేసి నీవు రాజవగుదువని వరమిచ్చి యది మొదలు జసల్మీరు రాజులందఱుఁ బట్టాభిషేక సమయమున సన్యాసి వేషముతో బిచ్చమెత్తెడు నాచారము నడపవలయునని శాసించి యంతర్ధానము నొందెనఁట. నాఁడు మొదలు జసల్మీరు రాజులు పట్టము కట్టుకొనునప్పుడు కాషాయవస్త్రములు కట్టుకొని యా యాచారము నడపుచు వచ్చిరి. దేవరాజు వనంతరము మున్నూరేండ్లవఱకు వాని సంతతివారు ప్రసిద్ధులుకారు. పన్నెండవ శతాబ్దమున జసూరావను నతఁడా సంస్థానమునకు ప్రభువయి యొకబ్రాహ్మణుని యుపదేశమున జసల్మీరు పట్టణము గట్టెను. ఆరాజు పిదప గద్దెయెక్కిన

రావులందఱు పేరుప్రతిష్ఠలులేనివారు. వారిలో లక్ష్మణసేనుఁ డనునతఁ డొకఁడు. అతఁడు మందమతి పరమ మూర్ఖుఁడు. ఆగా నొకనాఁడు రాత్రి నక్కలు కూయుచుండ విని యేల యవి యేడ్చుచున్నవని యడిగెనఁట. చలిబాధ కోర్వలేక యఱచుచున్నవని మంత్రి బదులుచెప్పెనఁట. అదివిని యామూర్ఖుఁడు కుట్టుపనివానిం బిలిచి నక్కలకన్నిఁటికి చొక్కాలు కుట్టుమని యాజ్ఞాపించెనఁట. మంత్రులు దొరకినన్ని నక్కలకు చొక్కాలుకుట్టించి తొడిగిరఁట. అయినను నక్క లూరకొనక మరల రాత్రులు కూయుచుండవిని రాజు దానికిఁ గారణము నక్కలకు వసియింప గృహములు లేకపోవుటయే యని తెలిసికొని మైదానములో వానికొఱకు కొన్ని యిండ్లు కట్టించెనఁట. ఆయిండ్లు మొన్న మొన్నటివఱకు నుండెను. ఈరాజుకాలమున నధికారము తయు భార్యచేతిలో నుండెను. ఆమె యమరకోట రాజుకూఁతురు. మితిమీఱిన యధికారము చేతఁదాల్చినందు కామెకు దగిన శాస్తిజరిగెను. ఆదేవి సోదరు లొకసారి జసల్మీరునకు రాఁగా రావులు వారిని జంపించి కోటగుమ్మమునకుఁ గట్టించెను.

ఆరాజు ననంతరము వానికొడుకు గద్దెయెక్కెను. కాని యతఁ డప్రయోజకుఁడగుటచే లక్ష్మణసేనుని పినతండ్రి జయత్సింహను నతఁడు రావులయ్యెను. అతని స్వభావము వేఱు. అతఁడు యుద్ధములలో ముక్కాకలదేరిన జోదు. ఆనాటి ధనుర్ధరులకెల్ల గురువు. అతనికొడుకులు మూలరాజు రత్నసింగు ననువారు తమబిడ్డలను రాజపుత్రకుమారులను విలువిద్యయందు గడునేర్పరులం జేసిరి. అదియే ముందుముందు వారికి గొప్పయుద్ధములలో సాయము చేసెను.

అలాయుద్దీనుకిల్జీ రాజస్థానము మీఁద దండెత్తి చిత్తూరు నాశనముచేసిన కథ యీవఱకే యెఱుంగుదుముకదా. జసల్మీరుప్రభువులు గూడ నీ మహాప్రళయములో బుద్ధిపూర్వకముగ లోఁబడిపోయిరి. ముల్తానుప్రభువు చక్రవర్తి యగు నలాయుద్దీనునకు గట్టవలసిన కప్పము పదునైదువందల గుఱ్ఱములమీఁదను బదునైదువందల కంచరగాడిదలమీఁదను వేసి పంపెను. ధనము దెచ్చుచున్న యాబిడార మొక ముద్దుననుండ

గా జయతీసు కొడుకులు దాని మాట విని గొప్ప సైన్యముం దోడ్కొని ధాన్యపువర్తకుల వేషములు వేసికొని యాబిడారముమీఁద బడి యా ధనముం దోఁచుకొనిరి. అది విని జయతీసు చక్రవర్తి స్వభావ మెఱిఁగిన వాఁడగుటచేఁ జాలభయపడి కోటమరమ్మతు చేయించి లోపలనున్న స్త్రీలను బిడ్డలను సురక్షితమగు తావునకు బంపి యాహధ్యులగువారి నిచ్చవచ్చిన చోటికి బోవనిచ్చి చుట్టుపక్క గ్రామములని గ్రసుష్కముగ జేసి తానును కొడుకులును మనుములు సంరక్షణకై సిద్ధమై చక్రవర్తి రాక కెదురు చూచుచుండిరి. అతని చిన్నకొడుకులు కోటవెలుపల నొక చిన్న సేనుం గూర్చుకొని ముందుగ చక్రవర్తి సేనలం దలపడ నుద్యుక్తులై యుండిరి. అలాయుద్దీను మహబూబ ఖాడు సేనాపతిని గొప్పసైన్యమిచ్చి జసల్మీరునకు బంపెను. ఆసైనికులినుప కవచములు దొడిగికొని క్రొక్కారు మబ్బులవలె భయంకరముగ నడచొచ్చిరి. జయతీసుకోట సంరక్షించు నుపాయములు చక్కగా నెఱుఁగును. ఆకోట కేఁబదియారు బురుజులుండెను. రావులాబురుజులమీఁద కోట గాపాడునిమిత్తము మూడువేల యేనూటయేఁబదిమంది సైనికుల నేర్పరచి మఱి రెండువేల సైనికులను సమయము వచ్చినప్పుడు రక్షించుటకు నిలువయుంచెను. శత్రువులు కోట ముట్టడి నారంభించిరి. ఒకవారము ముట్టడి యగునప్పటికి చక్రవర్తి సైన్యములో నేడువేలమంది కడతేరిరి. ఆముట్టడి రెండేండ్లు నడచెను. ఆకాలములో యుద్ధములు నిరంతరాయముగ జరుగుటచే నెవరు ముట్టడించువారో యెవరు ముట్టడింపఁబడువారో తెలియదయ్యె. రాజపుత్రులు కోట గోడలవెనుక నెండ వాన చొరని ప్రదేశములలోఁ దాఁగొని సరకులు స్వేచ్ఛగా దెప్పించుకొనుచు యుద్ధముచేసిరి. తురకసేన జయతీసుకొడుకులకు జడిసి శిబిరమువిడిచి పగతురపై రాఁజాలదయ్యెను. అట్లున్నను రావుల్ కొడుకులు పగతురకు సరకులను రానియ్యకైరి.

దీర్ఘయుద్ధములు జరుగునప్పు డుభయపక్ష సైనికులకుఁ దరుచుగా ప్రొద్దుపోదు అందుకు రెండుపక్షములవారుఁ దరుచుగ నాటపాటలం జరుపుచుండురు. రావుల్ కొడుకులలో నొకఁడగు రత్నసింగు బగతుఁడగు మహబూబుతో నెట్లో మైత్రిపాటించెను. ఇద్దఱు చతురంగ మాడుటలో నేర్పరులని యుండొరులకు దెలిసినప్పుడు వారి

మైత్రి మఱింత యధికమయ్యెను ప్రతిదిన మేదో కాలమేర్పఱచుకొని రాజకుమారుఁడు కోటవెడలియు నబాబు శిబిరము వెడలియుఁ గలిసికొని చతురంగ మాడుచుండుదురు. సేవకులు చతురంగపుబల్ల నొకచెట్టుక్రింద వేయ వారిరువురుఁ గడుమైత్రితోఁ జాలసేపాడుచువచ్చిరి.

ఈ కాలక్షేపము రమారమి యెనిమిదేండ్లు జరిగెను. అంతట రావుల్ జయసీ మృతినొంద జ్యేష్ఠ కుమారుఁడు మూలరాజు గద్దెయెక్కెను. నవాబు యథాపూర్వకముగ జతురంగ మాడుటకువచ్చి రాజపుత్రుల సంతోషమును గనిపెట్టి కారణమేమని యడిగెను. మూలరాజు పితృరనంతరము సింహాసన మెక్కినందున సంతోషము గలిగెనని సేవకు లుత్తరము చెప్పిరి. అదివిని నవాబు మూలరాజు పట్టాభిషేకమునకు జాల సంతసించి మేలుగోరి చెట్టుక్రిందఁ గూడి చతురంగమాడుట యింతటినుండి సంభవింపదనియు నదియే కడసారియనియు విచారపూర్వకముగాఁ జెప్పెను. దానికిఁ గారణ మేమన నల్లాయుద్దీను తన సేనాపతి పగతురతో నతిమైత్రి చేసినాఁడని విని చతురంగ మాడఁ గూడదని వర్తమానమంపెను. అందుచేత నవాబావిధమున జెప్పి మరునాడు యుద్ధములో మరల గలిసికొనవచ్చునని రత్నసింగును వేడుకొనెను. మరునాడు నవాబు చెప్పినట్లు మహమ్మదీయులు యుద్ధసన్నద్ధులైరి ఆమాట ముందే వినుటచే రాజపుత్రులుగూడ రణోన్ముఖులైరి.

అప్పుడు సంకుల సమరము జరిగెను. మహమ్మదీయులలోఁ దొమ్మిదివేలమంది మృతినొందుటచే వారిసైన్య మెట్టకేలకు పారిపోవలసివచ్చెను. చక్రవర్తియాపరాభవమును సహింపక తనసైన్యమును పెంచియు బలపరచి యుద్ధము సాగించెను. కోటలోనున్నవారికి భోజన సామగ్రులు క్రమక్రమముగ క్షీణించెను. లోనున్న రాజపుత్రుల సంఖ్యయు నంతకంతకు దిగనారెను. అంతట మూలరాజు మంత్రి సామంత సేనాపతి ప్రముఖులను బంధువులను బిలిపించి యిట్లనియె 'మనము మహాశౌర్యముతో శత్రువులపాలఁ బడకుండ తొమ్మిదేండ్లు కోటఁ గాపాడితిమి. పదార్థము లయిపోయినవి. బలము క్షీణించినది. ఇప్పుడు కర్తవ్యమేమి?'' ఆవచనములకు రాజపుత్రు లిట్లని రుత్తరము చెప్పిరి. ''కర్తవ్య మేమున్నది. మన కులాచార ప్రకారము ముందుగా నంతఃపురస్త్రీలను బరిమార్చి పిమ్మట మనము రణరంగమునఁ బ్రాణము విడుచుటయే కార్యము.''

అని కృతనిశ్చయులై వారు సన్నాహము చేసికొని మఱునా డుదయమున జూచునప్పటికిఁ జక్రవర్తి సైన్యము కానంబడలేదు. అంత గొప్పసైన్యమును జిరకాలము విదేశములలో నుంచుట కిష్టములేక చక్రవర్తి కోట ముట్టడి యేమైననుసరే తత్క్షణము బయలుదేరి రమ్మని సైన్యమున కాజ్ఞాపించెను. అందుచేత మహమ్మదీయ సైన్యము గానఁబడదయ్యె. అది చూచి రాజపుత్రులు మృత్యుముఖమునుండి బయట బడినట్లు మహానందభరితులై పరవశులై యుండిరి. ఆయుత్సాహ సమయమున వారదివఱకు చెఱపట్టిన నవాబు తమ్ముఁ డొకఁడదియే సమయమని తప్పించుకొని పారిపోయెను. పోయి జసల్మీరు కోటలోనున్న గుట్టంతయు సోదరునితోఁ జెప్పెను. ఆ గుట్టెఱిఁగి మహమ్మదీయ సేనాపతి తనసైన్యమును దీసికొని తలపెట్టిన పని సంపూర్ణము చేయుటకు మరల జసల్మీరునకు వచ్చెను. ఆ సైన్యముం జూచి మూలరాజు రత్నసింగుతో నిట్లనియె "నీవు నవాబునకుగల స్నేహమిదియేగదా! వానితమ్ముని జెఱపట్టినప్పుడే మనము సంహరించిన పక్షమున వాఁడుపోయి యున్నతో గుట్టుమట్టెల్లఁ జెప్పక యుండును గదా? మన మూరకుండుటచే నీయుపద్రవము వచ్చెను. మన మేమి చేయుదుము."

అనవుడు రత్నసిం గిట్లనియె. "ఇప్పు డొక్కటే దారియున్నది. అందువారంద ఱగ్నిప్రవేశ మగుటయు మగవారందఱు రణమున మరణమొంది వీరస్వర్గ మధిరోహించుటయుఁ గోటలోనున్న ప్రతివస్తువు నాశనము చేయుటయు."

ప్రధాన పురుషులందఱు రత్నసింగు మాటల నామోదించిరి. మూలరాజును వారికందఱు నుత్సాహము గలుగున ట్లిట్లనియె, "సరే మీరందఱు శౌర్యముగల వంశములందు బుట్టిరిగదా, మఱియు మీరాజు విషయమున మీప్రాణములైన దాఁచనివారు. మీకు లోకంబున నేవూరులు సాటిరారు. యుద్ధమున నేనుఁగులైన మి మ్మెదిరించి బ్రతికి పోలేవు. నామానరక్షణము మీచేతిలో నున్నది. మీప్రతాపమువలన జసల్మీరు వెలయుఁగాక !"

అని పలికినపిదప మూలరాజు రత్నసింగు తమతమ యంతఃపురముల కరిగి తమ నిర్ధారణమును రాణుల కెఱింగించిరి. ఆవార్తఁ విని రాణులలో నొక్కతె యిట్లనియె. "మీపనిమీఁద మీరుండుఁడు. మేమీరాత్రి పయనమై రే పుదయము స్వర్గములోఁ బ్రాంత కాఁపుల మై యుండుదము." తక్కిన రాణులు రాజపుత్రస్త్రీలు తద్విధము ననే బలికిరి.

రత్నసింగునకు మనసులో నొక్క విచారముండెను. ఆతని కిరువురు కొడుకులు గలరు. పెద్దవానిపేరు గురుసింగు రెండవవాని నామము కనూరు అందు జ్యేష్ఠుఁడు పంద్రెం డేండ్లవాఁడు. తన యనంతర మాపసిబాలు రేమగుదురో యని బెంగఁ గొని రత్నసింగు వారిని రక్షింపుమని నవాబునకు వర్తమానమంపెను. అతఁడు వాని మాటలయందు గౌరవముంచి బాలకుల నిరువుర సంరక్షించునట్లుఁ బ్రమాణము చేసి వారిం దనకడకు తోడితెచ్చుటకు నమ్మికగల యిరువుర సేవకుల నంపెను. రత్నసింగు బిడ్డలం గడసారి కౌఁగిలించుకొని యాసేవకుల కప్పగించెను. వారును జాగరూకతతో వారిని దోడ్కొనిపోయి మాబూబున కప్పగించిరి ఆమ్లేచ్ఛ సేనాపతి యాబాలకులను జూచి పగవాని బిడ్డలని వేరు భావముఁజూపక మిక్కిలి యాదరించి మంచిమాటలాడి వారి శిరస్సులమీఁద తనచేయి పెట్టెను. మహమ్మదీయులలో శిరస్సుమీఁద చేయి వేయుటరక్షించుటకుఁ బ్రమాణము చేయుట. అట్లు చేసి యాతురక పిమ్మట నిరువురు బ్రాహ్మణులం బిలిపించి యాకుమారుల వారికిఁజూపి రాజపుత్రుల గౌరవమునకుం దగిన రీతిగ వారి కన్నపానాదులు పెట్టించి విద్యాబుద్ధులు చెప్పి బాగుచేయుమని యప్ప గించెను.

అరాత్రియే కడపటిదగుటచేఁ గోటలో నున్నవారందఱు గలసిమెలసి యొట్టె టో నలుజాములుఁ గడపిరి. తెల్లవారినతోడనే ప్రాతఃకాల కృత్యములు తీర్చుకొని యీశ్వరప్రార్థన చేసి కోటలోనున్న యిరువది నాలుగు వేలన స్త్రీ లొక్కచోట

గుంపుకూడిరి, పాలుత్రాగెడు పసిబిడ్డయుఁ దలనరసిన వృద్ధయు వివాహముకాని కన్యయు పదుగురు బిడ్డలతల్లియు నా దచ్చట నేయుండెను. వేయేల: ఆఁడపురుగొక్కటియైన మిగులలేదు. కొందఱు కత్తులతోఁ బొడుచుకొని మృతినొందిరి. కొందఱు తమదేహముల నగ్నిహోత్రున కాహుతులు చేసిరి. శత్రువుని బారిఁజిక్కుట కొక్కయంగనయైన మిగులదయ్యె. స్త్రీ లిట్లగుచుండ పురుషులందఱు మేడలెక్కియుఁ గోటగోడలెక్కియు నాఘోరకృత్యములు జూచి తమభార్యలం గలిసికొను సమయము తమకుఁగూడ సమీపించుచుండెనని చాల సంతోషమొంది యాయుధములు ధరించియదివఱకు దాల్చిన రక్తవస్త్రములు గుఱ్ఱపుజీనులపైఁ బరచుకొని యొండొరులం గడసారి గౌఁగిలించుకొని వివాహమునకుఁజనినట్లు యుద్ధమునకుం జనిరి. తొమ్మిది సంవత్సరముల ముట్టడిలోను గడతేఱక యప్పటికి మిగిలిన పురుషులు మూడువేల యెనిమిదివందలు ఈ సైనికులందఱుఁ గోట తలుపులం దెరచి యొక్కమారు శత్రువులం గవిసిరి.

అప్పుడు ఘోరయుద్ధముఁ జరిగెను. రత్నసింగు సింగమువలె విజృంభించి నూటయిరువదిమంది యమీరులను దనకత్తికెరచేసి సమరమహాసముద్రమున మునిగిపోయెను. మూలరాజు తనబల్లెముతోఁ దురకల శరీరములను గ్రుచ్చిగ్రుచ్చి పొలియించెనాడు నెత్తురు వరదలై పారెననుట యతిశయోక్తిగాదు. మృత్యుదేవత తలవిరియఁబోసికొని విచ్చలవిడిగ విహరించెననుట కవిచాతుర్యముగాదు. యుద్ధము ముగిసినపిదప నవాబు మూలరాజ రత్నసింగుల కళేబరముల వెదకించి తెప్పించి కోటలోనికి బంపించి తగిన గౌరవములతో దహనములు చేయించెను. అనంతరము నవాబురత్నసింగుకొడుకులను జాగరూకతతోఁ గాపాడి వారు యుక్తవయస్కులైనపిదప రాజ్యభారము నప్పగింపఁ దలంచుచుండనంతలో నతనికి మరణము సంభవించెను. ఆ నవాబుకొడుకులు తండ్రిచేసిన ప్రతిన నెరవేర్పఁ గుమారులను ప్రేమతోఁ బెంచిరి. వారట్లు డిల్లీలోఁ బెరుగుచుండ మొగలాయీ అల్లాయుద్దీను రాజ్యముపై దండెత్తిరి. అప్పుడు రత్నసింగు కుమారుఁ డరుసింగు చక్రవర్తికి మహోపకారము గావించెను. ఆయుప

కారమునకు సంతసించి యలాయుద్దీను కృతజ్ఞుఁడై పిత్రార్జితమగు రాజ్య మాఁడుమాకు వకుఁ బట్టము కట్టియిచ్చి మున్ను తన సేనాపతియగు మాబూబు పాడుచేసిన కోటను మరల గట్టుకొనుటకు సెలవిచ్చెను. ఆగురుసింగు కొంతకాలమేలి పుత్రహీనుఁడై మృతినొంద రాజ్యము వానిజ్ఞాతులలో నొకని యధీనమయ్యెను.

## రాజస్థానకథావళి.

### జసల్మీరు రాజుల కథలు.

---

పదునైదవ శతాబ్ద ప్రారంభమునందు జసల్మీరుమండలము రాజులు మహాయుద్ధమునందుఁదగిలి యనేకులు నాశనము నొందిరి. ఈయుద్ధము వివాహముతో నారంభమై మరణముతో నంతమొందెను; జసలుమీరు సంస్థానములో పోగల్ అను పేరుగల చిన్న రాజ్యము కలదు దానిని రాణింగదేవరావు పాలించుచుండెను. అతని కొడుకు సాధు వనువాఁడు మేటివిలుకాఁడై చండశాసనుఁడని ప్రసిద్ధిఁజెందెను అతని పేరు విన్న రాజస్థానమందలి మహావీరులు చండుఁడు మొదలయినవారు సయితము గడగడ వడంకుచు వచ్చిరి. ఇతరసంస్థానములం ద్రోపుడు చేయుటలో నందివేసిన చేయి యని పేరు వడిన హర్బశంకరుఁడు సయితము సాధువు ముందర ఱవిటీ ముందర దీపమని చెప్పవచ్చును. ఒకనాడు సాధువు స్వబలముతో నొక దండయాత్ర చేసి వచ్చుచుండ మధ్యమార్గమున మోహిలువంశస్థులకు దొరయగు మాణిక్యరావు వానిం జూచి తన కోటకుం బిలిచెను. సాధువు దూరమాలోచింపక పిలిచినతోడనే వాని కోటకుఁబోయి యతిథియయ్యెను. దేశమునంతను గడగడ వడకించుచున్న యమ్మహాశూరుని గన్నులార చూడవలయునని కోటలోనివారందఱుబలాట పడిరి. రాజబంధువులు సేవకులు నెపమేదో గల్పించుకొని తప్పక వానిం జూచి పోయిరి.

మాణిక్యరావు పుత్రికయగు కురందేవి తక్కినవారివలెనే వానిం జూడ నభిలషించి తెరలమాటునుండి పలుమారు వానిం దొంగితొంగి చూచి వానిని మోహించెను రాత్రి భోజనానంతరమున మిక్కిలి యవసరమయిన పనిమీఁద మాటలాడవలసియున్నదని కురందేవి మాణిక్యరావు నంతఃపురమునకు రమ్మని వర్తమాన మంపెను. అంతయవసరమగు పని యేమి యని యోచింపుచు మాణిక్యరావు పుత్రికాంతఃపురమునకుఁ బోవ నాబాలిక తాను సాధువును దప్ప మఱియొక పురుషుని వివాహమాడుట లేదని యొట్టు పెట్టుకొని సత్వరము పెండ్లిచేయుమని తండ్రిం బ్రార్థించెను మాణిక్యరావు కూఁతురు పలుకులు విని విస్మితుఁడై "అమ్మా! ఈవఱకే నిన్ను మండూరు నాగూరుసంస్థానముల ప్రభువగు చండు   కుకును పెండ్లి చేయఁదలఁచి ప్రధానము చేసితిని: ఇప్పుడు మరల నిట్లు చేయుట న్యాయమా? కావున నీ పంతము విడువు" మని బతిమాలుకొనెను   తబతిమాలుకొన్నను కురందేవి తనమాట   ఎవ్వరి కేమికష్టములు

వచ్చునో యని విచారింపక పట్టినపట్టు విడువదయ్యె. కూఁతు రట్లు చేసినను లోకవ్యవహారవేత్తయగు సాధు వా వార్త విన్నప్పుడు తనను సాయము చేయకపోవఁ డనుకొని మాణిక్యరావు కురందేవి ప్రతిజ్ఞ సాధువున కెఱింగించెను.

రాజకన్య మోహపరవశయై వివాహార్థముపురుషుని వరించినప్పుడు రాజపుత్రుఁడా బాలికమాటం ద్రోసిపుచ్చఁగూడదని రాజపుత్రులలో నొక నియమము గలదు. అందుచే వృద్ధాచారము దాటఁగూడదని సాధువు మాణిక్యరావు తన్నెంత నిరుత్సాహపరచినను బీరువోక కురుందేవిని వివాహమాడక మాననని చెప్పెను. మాణిక్యరావు దయాళువు శాంతశీలుఁడు నగుటచేఁగుమార్తె పంతమే చెల్లనిచ్చి కులాచారప్రకారము కొబ్బరికాయ పసపుకుంకుమ పోగల్లునకుఁ బంపి ప్రధానముచేసి వివాహముహూర్త మేర్పరచెను సాధువు బంధు మిత్ర పరివారముతోఁ బాణిగ్రహణ నిమిత్తము మాణిక్యరావుకోటకుఁ బోయెను. కురందేవి యంతకుమున్న రహతూరు వంశస్థుఁడు చండునికొడుకు నగు నిరంకుశులునకు వాగ్దత్తము సేయఁబడినది. ఇరంకుశలుఁడు మున్ను తనకుఁ బ్రధానముచేయఁబడిన యొకకన్య యొకద్రోపుడుకాని యాధీనముగుచుండెనని విని పెచ్చుపెరిగిన యీసున నూరకుండజాలక యా కొత్త పెండ్లికొడుకు ద్రొన్నెత్తురు చూచితీరవలయునని శపథము చేసి సహాయార్థము బంధువుల ననేకుల బిలిచి బయలు దేరెను. నాలుగు వేలమంది రహతూరులు వానికి బాసటయై నిలిచిరి. కొల్లగాంద్రకు గురువగు హర్బశంకరుఁడుగూడ తనగుంపులతో వానికిందోడునూపెను ఈసైన్యమునకు మెహరాజను నతఁడు నాయకుఁడై నడిపించెను. ఈమెహరాజు కొడుకులలో నొకనిని బూర్వము సాధువు చంపిన కతమున వారి కిరువురకుండిన పాతఁపగ దీర్చుకొనుటకై యీ ప్రభువు బయలుదేరెను.

వివాహము సుఖముగా జరిగెను. ఆమహోత్సవానంతరమున సాధువు భార్యాసమేతుఁడై స్వదేశమునకుఁబోవ సమకట్ట మాణిక్యరావు కూఁతునకు నిజముగా నప్సరసలవంటి పదముగ్గురు పరిచారికలను వెండి బంగారు వస్తువులను వాహనంబులను జాల నరణమిచ్చి ప్రయాణము నిరపాయముగ నుండుటకు వెంట గొంతసైన్యముం దీసికొని పోవుట మంచిదని “ నాయనా నీ సెల వైనపక్షమున నా [illegible] వేలు సైనికుల నీ వెంటఁ బంపెద. దీని కాదంబడు”మని బతిమాలెను. వ్యాప్తి [illegible] ” యల్లుఁడు నవ్వి “ నాతో నేడువందలమంది భటులు వచ్చినారు. వారుండగ మఱి వ్వరు నక్కర

లేదని నిర్లక్ష్యముగ నుత్తర మిచ్చి మామగారి ప్రార్థనముమీఁద తన బావమఱదులలో నొకనిని సైనికుల నేఁబదిమందిని వెంటఁ గొనిపోవుటకు సమ్మతించెను.

ఆ కైరంక్లివా రట్లు బయలుదేరి నిరపాయముగఁ గొంత దవ్వరిగి యన్నపానాదులకు ననుకూలముగనున్న యొకతావున విడిసి యాపూట నట గడపఁదలఁచిరి. సాధువు బంధువులలో జయతింగుఁడను వాఁ డొకఁ డుండెను అతఁడు సైనికుల కోలాహలములేనిచోట సుఖముగ నిద్రింపవలయునని బసచేసిన తావునకు గొంతదూరమునఁ గుఱ్ఱపుజీను నేల పరచుకొని కత్తిమ భుజమునకుఁ జుట్టబెట్టుకొని పండుకొనెను అతని గుఱ్ఱము తెల్లనికాళ్ళు మొగమున తెల్లని మచ్చ మొదలగు కళ్యాణలక్షణములుఁగల యుత్తమజాతి తురంగము ఆహారము మేఁత మేఁయక నిద్రించుచున్న యజమానుని సంరక్షణమే ప్రధానముగఁ జేసికొని నలుగడలం బరికింపఁ జొచ్చెను. అంతలో గుఱ్ఱముల డెక్కల చప్పుడులు వినంబడెను వెంటనే కొంతసేన గానఁబడెను. ఆ సైనికుల మొగములు మున్ను గుఱ్ఱ మెప్పుడు జూడని క్రొత్తవి. అందుచే నాయశ్వము యజమానున కేదో యుపాయము మూఁడనున్నదని గ్రహించి వానిం గాళ్ళతోఁ ద్రొక్కసాగెను. ఊరక త్రొక్కుచున్నదనుకొని జయతింగుఁడు "ధవళపాది! నన్ను నిద్రపోనిమ్ము త్రొక్కకు" మని బద్ధకముతో బలికి కాళ్ళవలకు త్రోసివేసెను. త్రోసినను గుఱ్ఱమూరకొనక మాటిమాటికి మరల ద్రొక్కుటచే జయుతింగు డేదో యపాయమున్నదనుకొని తక్షణమే లేచి నలుదెసలఁ జూచెను. చూచునప్పటికి రవుతువారులు వానిం జుట్టుముట్టిరి.

మహారాజా జయతింగు నడివఱ కెత్తఁగియుండుటచే నిరంకుశవలునకు వానిం జూపెను. ఇరంకుశవలుఁడు తన రవుతువారు భటులలో నొకనిని బిలిచి "మాలో నెవరితో సైనద్వంద్వయుద్ధమునకు రమ్మని జయతింగుని బిలువుమని పంపెను. ఆభటుఁడు పోయి ద్వంద్వయుద్ధమునకు రమ్మని బిలువ జయతింగుఁడు "వచ్చుటకు నాకు భయము లేదు. కాని యిప్పుడు రాఁజాలను. నా నల్లమందు మద్ద తయిపోయినది. మహారాజు వద్దనుండిగాని యిరంకుశవలుని కడనుండిగాని యొక మోతాదు నాకుఁ దెచ్చిపెట్టి యుంచుక సేపు మరల నిద్రింపనిత్తువేని యుద్ధమునకు సిద్ధమయ్యెద" నని చెప్పెను ఆ భటుఁడుపోయి యఱ... గింప మహారాజు కావలసిన నల్లమందుమద్దతు వానికంపెను. అదిచేకొ... జయతిం... సాళమంటునట్లు పీల్చి మరల గాఢముగ నిద్రించి మెలకువ వచ్చి... దప ...మున కభిముఖుఁడై ... నెక్కి గుఱ్ఱమున

నుత్సాహకరములగు పలుకులు పలుకుచు వెడలెను.

అతఁడు కొంతదవ్వు నగునప్పటికి శత్రుబలమునుండి యొక జోదు వానిమీఁది కురికెను. గుఱ్ఱము జోదుకలిసి వానిని తత్క్షణమే కడతేర్చిరి. నెత్తురు కన్పట్టఁబడుటయు జయతుంగుఁడు పులివలె భయంకరుఁడై శత్రుమండలమధ్యమున దుమికెను. ఇరంకువలుఁడు మహారాజు సంకులయుద్ధమున కొప్పుకొనక తమ పక్షము నుండి యొకవీరుఁడు శత్రుపక్షము నుండి యొక వీరుఁడు గలిసి వేరు వేరుగ యుద్ధములు సేయవలయునని యేర్పరచిరి. ఆనియమమున కొడంబడి రెండు సైన్యములు దారుణముగ బోరెను. ఇరంకువలుని బలములో నాలువందల మంది మృతినొందిరి. సాధువు సేనలో రమారమి నాలుగు వందలు గడతేరిరి. అట్లు జరుగుచున్న యాకలహమును గలహాకారణురాలగు కురుందేవి తెరచాటునుండి చూచి యానందించుచుండెను. అప్పుడు సాధువు గుఱ్ఱమెక్కి శత్రుబలముం జొరబడి ద్వంద్వయుద్ధమునకువచ్చిన యిద్దఱు మహావీరులను జంపి తన శిబిరమునకుం బోయి భార్యమెప్పునందెను. శత్రువులు వాని జయమున కోర్వక మరల డీకొనుటయు నతఁడు తన శరీరమునిండ దగిలిన గాయములంబట్టి యటమీఁద జయము నొందుట దుస్సాధ్యమని మరణోన్ముఖుఁడై రణమునకుఁబోవ సమకట్టెను. అప్పుడు క్రొత్తదంపతులు కడసారి దృఢాలింగనము చేసికొనిరి. కురుందేవి మూఁడునాళ్ళు కాఁపురము చేసిన క్రొత్తపెండ్లికూఁతురయ్యు భర్త నుత్సాహము కలుగుట కిట్లనియె. “నేను మీవీరకర్మమును గనిపెట్టుచునే యుండెదను రణమునుండి మీరు మరల రానియెడల నేనే మీకడకు సత్వరము వచ్చెదను.”

సాధువు నిర్విచారముగ రణరంగమునకుఁ బోయి ద్వంద్వయుద్ధమున కిరంకువలుని బిలిచెను. అతఁడు తక్షణమే వచ్చి వాని నెదుర్కొనెను. తళతళమని కత్తులు మెరయ నిరువురు నొండొరులం దాకిరి. సాధువు తన యెదిరి నొడిసిపట్టి నొక్కయూపున నేలం గూలవేసె. ఇరంకువలుఁడు నేలఁగూలుచు సాధువుం బట్టుకొని తలపై నొక్క దెబ్బఁ గొట్టెను. ఆదెబ్బతో సాధువక్కడనే మృతి నొందెను. ఇరంకువలుఁ డప్పటికి ప్రాణముతో నుండుటచే సేవకులు వానిని శిబిరమునకుం గొంపోయిరి. ఆయుభయవీరు లట్లు పరస్పరఖడ్గహతులఁ ద్రెళ్ళుటగని సైనికులు యుద్ధమును మానిరి.

కురుందేవి భర్తృమరణమును విని శోకింపక [illegible] ప్రాణేశ్వరుఁడు పడియున్నచోటనే చితిఁ బేర్[illegible]నానతిచ్చెను. సేవకులం [illegible] ములం బేర్చి

చమురు వోసి సాధువు కళేబర మందు బెట్టిరి. అంతట కురందేవి చితిఁజేరి యొకఖడ్గమును దెప్పించి దానినిఁ గుడిచేతితోఁ బట్టుకొని తన యెడమచేయి తెగవేసికొని పరిచారకులం బిలిచి " ఓసీ! యీభుజము పోగల్లునకు గొంపోయి నా ప్రాణేశ్వరుని తండ్రిగారికిం జూపి మీకోడ లిట్టిదిసుడీయని చెప్పు"డని యాజ్ఞాపించి రెండవచేతితో మగని తన యొడిలోనం బెట్టుకొని యంతతో నిలువక పరిచారిక నొకర్తు బిలిచి "ఓసీ! నాకుడిచేయి ఖండించి దానిమీఁద నున్న నా పెండ్లినాటి నగలను మా తండ్రి యాస్థానములోనున్న చారణున కిచ్చివేయుఁ"డని యాన తిచ్చెను. పరిచారిక యజమానురాలు చెప్పినట్లు చేసెను. అంతట నాయింతికాంతునితోఁ గలిసి యగ్నిదేవున కాహుతి యయ్యె.

ఇరింకువలుఁడు గాయములతో గొన్నినాళ్లు బాధపడి యెట్టకేలకు మృతినొందెను వీరుల కిరువురకు నంతము గలిగెఁను కలహముల కంతము గలుగదయ్యె. కుమారులు. మృతి నొందిన వార్తలు విని వారితండ్రులు కలహము వకు డీకొనిరి సాధువు తండ్రి యగు రాణింగదేవు రావు పుత్రుని మరణవార్త విని కోడలు పంపిన హస్తమునుజూచి శత్రువులపై బగదీర్చికొన వలయునని చుట్టములనెల్ల బిలిపించి మూకలం గూర్చుకొని బంటులుదేరి వెనుకటి యుద్ధములోఁ బ్రధానముగ బనిచేసిన హార్బ్యాసంఖ్లా యను నాతని దాకెను సంఖ్లాకు మిక్కిలి యపాయ కరమగు గాయము తగిలెను వానిసైనికులు మూఁడు వందల యేబది మందిలో నిరువది యైదుగురు మాత్రమే జీవించి పారిపోయిరి. రాణింగదేవుఁడు పగతు రంగసిదీరజంపి దొరకిన సొత్తెల్ల దోఁచుకొని జయప్రాప్తికి జాల సంతసించి హాయిగా మరల దన కోటకుం బోవుచుండెను అంతలో నెక్కడ నుండియో యిరంకువలుని తండ్రియు మండూరు సంస్థాన ప్రభువునగు చందుఁడు ప్రచండ కోపముతో వాని కడ్డమువోయి తాకెను. అప్పుడు చాలసేపు సందడి కయ్యమాయ్యెను. రాణాంగదేవుఁడు తన యనుచరులం గలిసి యుద్ధభూమిం బడియె. చందుఁడు జయశీలుఁడై శత్రుసంహారముఁ జేయ గలిగినందుకు మిక్కిలి సంతసించి మండూరునకుఁ బోయెను.

వైరమప్పటికి నంత మొందలేదు. రాణింగదేవుని పుత్రులగు మిహిరుఁడు టన్నుఁడు గలహాగ్నిని మరల రవులుకొల్పి సమకట్టిరి. కాని పోగల్లు సంస్థానము మిక్కిలి చిన్నదగుటచే బలవంతులు ధనవంతులు నగు మండూరురాజుల ధాటికాగలేదని వారు తెలిసికొనిరి. కొత్తపెండ్లికొడుకగు సోదరుని సోదరానంతరమున జనకుని వధియించిన చందుని జెండాడక విడుచుట కిష్టములేదు. చాలని పౌరుషములకుఁబోయి సంస్థానము దిబ్బచేయుట కంతక [illegible] లేదు. నెల్లైన పితృపరాభవము మాన్పుకొనవలయునని కృతనిశ్చయులై, [illegible] తమకు పోగల్లుసంస్థానమునంగల హక్కులన్నియు వదలుకొని క[illegible] బోయిరి. [illegible]చక్రవర్తియగు [illegible]కిజరుఖానును జూచి స్వయుతము[illegible]లై పగతుఁడగు చందునిమీఁ[illegible]ండెత్తి పోవుటకు

సేన నిమ్మని వాని నాశ్రయించిరి. చక్రవర్తి కొంత సేన నిచ్చెను. ఆబలమును గూర్చుకొని వారు చందునిమీఁది కరుగుచుండ జసల్మీరు రాజాయొక్క మూఁడవ కొడుకగు కేలన్ వారికిం దోడునంపెను. కేలన్ కు మొదటినుండి పోగల్లు సంస్థాన ప్రభువులమీఁద నిష్టమగుటచే నతఁడు వారిం గలిసి శత్రుసాధనము కేవలము శౌర్యముచేతనే గాక మాయోపాయముచేతఁ గూడ చేయవలయునని యున్ననను మిహిరునకుఁ గూడ నుపదేశించెను. పగ తీర్చుకొనుటకై తురకలయిన యా రాజకుమారు లిద్దరు వాని యుపదేశము విని యతని చెప్పినట్లు నడువ నొడంబడిరి

అప్పుడు కేలన్ ముందు మాయోపాయమే ప్రయోగింపదలఁచి చందునకు వినయముతో నొక జాబు వ్రాసెను. ఆజాబులోని విషయము లివి "మన రెండు సంస్థానములకు గల నిరంతరవైరము నాకు మిక్కిలి సంతాపము గలిగించుచున్నది. మనము సంధి చేసికొని సమ్మతిగ నుండఁగూడదా? మన దండయాత్రల మూలమున సరిహద్దులలో నున్న జనులు వేగిపోవుచున్నారు. సంధికి నేనే ప్రథమ ప్రయత్నము చేసెదను. నా కూఁతురును నీకిచ్చి వివాహము చేసెదను. రాజపుత్రులకు లాచారప్రకారము నీవు మాయింటికి వచ్చి కన్యను పాణిగ్రహణము చేయవలసినదే; కాని నాగృహమునకు వచ్చుటకు నీమనసులో ననుమాన ముండవచ్చుఁ గనుక నాచార విరుద్ధమయినను సరే నాపుత్రికను వివాహము నిమిత్తము మీయింటికే పంపెదను."

ఆలేఖలోనున్న విషయములు చందునకు మిక్కిలి గౌరవము కలిగించునవియు ఖేలనుకు మానహాని కలిగించునవియునై యుండెను. రాజపుత్రుఁడైనవాఁ డెవ్వఁ డొడంబడని యంతనైచ్యమునకు కేలన్ సమ్మతించుటచేఁ జందుఁడు వానిని నమ్మి వివాహమున కంగీకరించెను. వివాహము నాగూరులో జరుగుట కేర్పడెను. కేలన్ తనకుమార్తెం దీసికొని బయలుదేరి వచ్చెను. చందుఁడు చుట్టములను నెచ్చెలులను స్వల్పపరివారమును వెంటబెట్టుకొని కోటవిడిచి పెండ్లివారి నెదుర్కొనుటకు కొంతదూర మరిగెను. పెండ్లికూఁతురువారి పక్షమున మునుముందు చిన్న గుఱ్ఱపుదళము బరువుతో నుండిన కొన్ని యొంటెలు వచ్చెను. దానివెనుక తలుపులు మూసిన రథము లేబది వచ్చెను. ఆ యేబదిరథములచుట్టు గొంత రక్షకసైన్యముండెను. పెండ్లివారు వచ్చిన రాకఁ జూడ జందునకు లోలోపల ననుమానము తట్టెను. సారె కావిళ్లుగాని వెండి మంచములు గాని బంగారు నగలుకాని వానికండ్ల కగపడలేదు. గుఱ్ఱపుదళము కొంచెము సన్నాహము చేయ నారంభించెను. అదిచూచి చందుఁడు వెనుకకు మరలవలసినదని స్వజనమున కాజ్ఞయిచ్చెను. కాని యాజాగ్రత్త లాభకారి కాలేదు.

ఏబది రథములనుండి మహాధీరులనేకులు గు[illegible] వేలకుఱికి కత్తులు
దూసి చందునిమీఁద బడిరి. దానితో [illegible] క ప్రక్కనుండి
వానిం దాకెను. చందుఁడు [illegible] పోటులురి [illegible] దుటనే స్మృతి
నొందెను, చం[illegible] విశ్వాసులగు రహతూరులు [illegible] యచుండ పగతు

రగు తురకలు రాజపుత్రులుగూడ వానితో గలిసి కోటలో ప్రవేశించిరి. ఢిల్లీనుండి వచ్చిన తురకలు పట్టణమంతయు దోచుకొన నారంభించిరి కొండొకసేపు వారు కొల్ల గొనినపిదప రెండు దెసలనున్న రాజపుత్రులు తమ పూర్వ వైరవములు విడిచి యొండొరులం గలిసికొని మన మిందరము జీవించియుండగా మనయెదుట మహమ్మదీయులు రాజపుత్ర పట్టణము దోచుకొందురా ? మనకిప్పుడు విరోధము లుండవలసిన పనిలేదు. రెండువైపుల దండ్రిగొడులు మృతినొందినారు రెండుకుటుంబములు గౌరవములు నిలబెట్టుకొన్నవి. కావున యికముందు మైత్రిగలిగి యుందమని యభిమాన పరవశులై యాదోపిడు మాన్పదలచి ఇద్దఱకు సామాన్య శత్రువగు తురకను దుంప తెంప నిశ్చయించిరి అట్లు నిశ్చయించుకొని రహతూరులు భట్టీలు గలిసి తురకలమీద బడి దొరకినవారిని తుత్తునియలుగ ఖండించి తోపిడుధనము మరల దోచుకొని సంతుష్ట హృదయులై తమతమ తావులకుం బోయిరి. ఈ యుద్ధమున మిక్కిలి నష్టపడినవారు రాణాంగదేవుని పుత్రులు. స్వమతమువిడిచి బుద్ధిపూర్వకముగ తురకలై వారు కులభ్రష్టులయిరి. చక్రవర్తి యిచ్చిన సైన్యము గోలుపోయిరి. మాయోపాయ విశారదుడగు కేలను పోగల్లునకు బోయి వారి రాజ్య మాక్రమించు కొనియె.

కేలను కొడుకు చాచకదేవుడను వాడు పితురనంతరమున గద్దెయెక్కెను. అతడు తండ్రికన్న నేర్పరి. అతడు దుండగుడై చుట్టుప్రక్కల దేశములను బలుమారు కొల్లగొని యొకసారి సేనలతో పంజాబుదేశమున కరిగెను. అప్పు డతని కొక దారుణరోగము సంభవించె. మంత్రములుగాని మందులుకాని పనిచేయనందున మరణము సిద్ధమయినదని యతడెఱింగెను రోగపీడితుడై పాన్పుమీద బండుకొని కుళ్లి చచ్చుట రాజపుత్రున కవమానకరమని యభిప్రాయపడి యట్టిచావు చచ్చుట కిష్టము లేక యెవ్వరైన నప్పుడు తనతో యుద్ధమునకు వచ్చినపక్షమున సమరమున గత్తిపోటుతిని మేను చాలింపవలయునని యతడభిలాష మొందెను. చాచకదేవుడు యుద్ధములయందు గడితేరిన పోటుమానిసి. అతని యెదుట నిలిచి యాకాలపు వాడెవడు యుద్ధము సేయలేక యుండెను. అందుచే వానిపోరుట కెవ్వరు దొరకరైరి.

అతనికి పూర్వకాలపు శత్రు వొకడుకలడు. ఆ శత్రువు ముల్తానురాజు. చాచకదేవుడు వానిని రెండుసారులు గొప్పయుద్ధములలో నోడించి చాల నవమానపరిచెను అతనికి వీని పేరు గర్భనిర్భేదకమై యుండెను. చాచకదేవుడు ఖడ్గమరణముచే బడవలయునని యుబలాట పడి యతినీచమై రాజపుత్రప్రతిష్ఠకుం దగని మంచపుమరణము దనకు దప్పించి ఖడ్గమరణ మిప్పింపవలయునని బ్రతిమాలుచు దన ప్రాతపగతుండగు ముల్తానురాజు [illegible] వంపెను. ముల్తానురాజుపేరు కాలుషుడు. కాలుషుడా వర్తమ [illegible] స్నేహ మొంగరియుత్తో ముల్తానుపట్టణము మూడవసారి పట్టుకొ [illegible] గుని సందేహించెను. ఆవార్త దె [illegible] చ్చిన మాత [illegible] నిన్న ద్రోహము

చేయుదలంచుకొనలేవని నేను ప్రమాణముచేసి చెప్పెదను. అతఁడు నీ చేత గౌరవస్థైర్యాన మరణము నొందవలయునని కోరుచున్నాడు. అయన అయిదువందల సైనికులకంటె నెక్కువ జనమును దీసికొనిరాడు" అనవుడు ముల్తానురాజు ప్రాంతపగతుని గూర్చి జాలినొంది వాని యిష్టప్రకారము యుద్ధమునకుఁ బోవుట కొడంబడెను. చాచకదేవుఁడా పలుకులు విని సంతసించి లోకవ్యవహారోన్ముఖుఁడై భార్యలవద్ద సెలవు గైకొని యాస్తి కొడుకులకు సమానముగ బంచిపెట్టి యన్నిచింతలమాని స్వల్పసైన్యముతో బయలుదేరి యుద్ధమునకుఁ బోయెను. ముల్తానురాజు గూడ మాటదప్పక వానిని నెదుర్కొన బోయెను. అప్పుడు చాచకదేవుఁడు స్నానము చేసి సంధ్య వార్చి భగవంతునిఁ బ్రార్థించి దానములు చేసి కత్తికిఁ బూజచేసి పాదవభ్యాసము లేక యుద్ధమునకుఁ బోయెను. రెండుగంటలసేపు సంకుల సమరము జరిగెను. ఇరువంకల జాలమంది సైనికులు మృతినొందిరి. చాచకదేవుఁడు ముల్తానురాజుచేత ఖడ్గమరణము నొంది తన యభీష్టము నెరవేర్చుకొనియె.

కాలుషుఁడు తన్ను యాచించిన పగతునికి గడపటి కోరిక దీర్చి స్వస్థచిత్తుండై గృహమునకుఁ బోయెను. చాచకదేవునకు జ్యేష్ఠభ్రాత యొకఁడుండెను వానిపేరు కుంభుఁడు. అతఁడు పిచ్చివాఁడగుటచే తండ్రి వానియాస్తి వానికి బంచిపెట్టక తక్కినసోదరులకిచ్చెను. ఆపిచ్చివాఁడు తన తమ్ముని మరణము వినినతోడనే తన చిన్నతమ్ముడగు వీరశీలుని కడకుఁబోయి చాచకదేవునిం జంపినందుకు ముల్తానురాజుమీఁద బగదీర్చుకొనబోవ గోరెను. పిచ్చివాని మాటకడ్డము చెప్పుట యపాయము తెచ్చుకొనుటనుచు వీరశీలుఁడు దానికి సమ్మతించెను. కుంభుఁ డొక్క సేవకుని వెంట బెట్టుకొని ముల్తాను సైన్యముపోయినదారినే పోయెను. అప్పటికి ముల్తానురాజు స్వనగరము జేరలేదు. ఆరాజు సైన్యముతో నొక కోటలో దిగెను. ఆ కోటకు పదకొండు గజముల వెడల్పుగల కందకము చుట్టు నుండెను. కుంభుఁడా కోటవద్దకుబోయి గుఱ్ఱమును తరటిచేసి పదకొండుగజముల కందకము దాటించెను. సేవకుఁ డీవలిప్రక్కనె యుండెను. అట్లు కందకము దాటి కుంభుఁడు ముల్తానురాజు పండుకొన్న గుడారమునకుఁబోయి యొక గడియలో దిరిగి యీవలకు వచ్చి మరల గుఱ్ఱముచేత కందకము దాటించి సేవకుని కలిసికొని యింటికి బయలుదేరెను. వీరశీలుఁడు తక్కిన రాజబంధువులంగూడి కొలువున్న సమయమున కుంభుఁడు మిక్కిలి యలసి వగర్చుచు వాని ముందర నిలిచి యొక మనుష్యుని తల వారి యెదుట పడవేసెను. అందఱు వానింబోల్చిచూచి యది ముల్తానురాజగు కాలుషుని తలయే యని గుర్తించిరి.